రథోపస్థ ఉపావిశత్ - వాళ్ళ పాదముల దగ్గర కూర్చున్నాడు
అర్జునికి అతని విషాదము యోగముగా చెప్పబడింది ఇది
ప్రథమోధ్యాయః

"శ్రీ శంకర భాష్యము"

→ "స్వప్రయోజనాభావేపి భూతానుజిఘృక్షయా వైదికం
హి ధర్మద్వయం అర్జునాయ శోకమోహ మహోదధౌ నిమగ్నాయ
ఉపదిదేశ।"

→ శ్రీకృష్ణుడు - ఉపదిదేశ - ఉపదేశమున్ను చేసెను ఉపదేశించెను.
So ఏమేమి ఉపదేశించాడు? గీతను ఉపదేశించాడు అని అనకూడదు, గీత
ఆయన చేసిన ఉపదేశానికి మనం పెట్టుకున్న పేరు. ఆ పేరు కూడా అలా
ఉందని ఆయనకి తెలియదు కదా కాబట్టి ధర్మద్వయం ఉపదేశ
రెండు రకముల ధర్మమును ఉపదేశించాడు.
→ ధర్మము ద్వివిధము, మనం చూసాము ప్రవృత్తి లక్షణ, నివృత్తి
లక్షణమున్ను. ధర్మానికి మూలం జ్ఞానం అవగాహన లేనిది జ్ఞానము లేనిది
ఏదీ లేదు. So మనం (జీవితం ఒక యుద్ధరంగం అనుకుంటే) యుద్ధరంగం లో
మనం ముందుకు వెళ్ళాలన్నా జ్ఞానంతో తెలిసి వెయ్యాల్సి ఉంటుంది
వెనక్కి వెళ్ళాలన్నా తెలిసి వెయ్యాల్సి ఉంటుంది Either you advance
or go back. Stratagical గా ఉండాలి. Retreat Stratagical గా
ఉండాలి గాని, అజ్ఞానం తో కాదు చేయకూడదు కదా. జీవితంలో మనం ఒక
కర్మని చేసినప్పుడు ప్రవృత్తి అంటారు. దాని వెనకాల చక్కటి అవగాహన
ఉండాలి. ఒక కర్మని పరిత్యజించినప్పుడు, విడిచిపెట్టినప్పుడు, No I
will not do it అని విడిచిపెట్టినా తప్పేమీ కాదు. కానీ దాని వెనుక
సరైన అవగాహన ఉండాలి. కాబట్టి ఒక పని చేసినప్పుడు Correct గా
చేయాలి మానేసినప్పుడు Correct గా మానేయాలి. మనమేమో చేసేది
తప్పుగా చేసి మానేసినప్పుడు తప్పుగా మానేస్తాం. అలా ఉండకూడదు
→ వాడు తప్పు పని చేస్తున్నాడనుకోండి, ఆ అలాగ తప్పుగా చేస్తున్నాడు వద్దు

Assignment మానేసెయ్ అంటే, సరే Priority బాగుంటే నువ్వు మానేయమన్నావు
గా మానేసి కూర్చుంటాడు ఇంక. ఏదీ లేకుండా అలా ఖాళీగా
కూర్చున్నాడు అంటే నువ్వు మానేయమన్నావుగా అంటాడు.
అలా ఉండకూడదు చేసినప్పుడు Correct గా చేయాలి

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | 30 | 31 | • | • | • | • |

• మానసికమైనప్పుడు correct గా మారాలి. So ధర్మానికి సంబంధించి
భౌతికమైనప్పుడు ఎలా చేయాలి? అదే ధర్మం, మానసికమైనప్పుడు ఎలా మారాలి
అది ఇంకో ధర్మం. ధర్మ ద్వయం. తరువాత రెండు ధర్మాలు. కావంటే
మూడు ఉన్నాయి, నాలుగు ఉన్నాయి. అని ఎవళ్ళ సంఖ్య వాళ్ళది. But funda-
-mentally రెండు. ఆ రెండింటిలో ఒకదాన్ని ఇంకా further గా విడదీయడం
ఉండదు. జ్ఞానం. ఇంకోదాన్ని అనేక విభాగాలు చేయొచ్చు, కర్మ. ఎందుకంటే
కర్మలో వికల్పాలు ఉంటాయి. కర్మలో మరి variations ఉంటాయి కాబట్టి
కర్మ అనే ధర్మంలో అనేక అవాంతర భేదాలు ఉండే అవకాశం ఉంది.
→ కర్మ మానసికం కావచ్చు, వాచికం కావచ్చు, కాయికం కావచ్చు కాబట్టి
అవాంతర భేదాలు కర్మలో ఉంటాయి. కర్మయే మానసికమైనప్పుడు. దాన్ని
ధ్యానం అని పేరు, భక్తి అని పేరు. వాచికం అయితే జపం అని పేరు
కాయికం అయితే ఏదో నమస్కారము, పూజ అని పేరు. ఇన్ని
అవాంతర భేదాలు కర్మయందు ఉంటాయి. కాని జ్ఞానములో అవాంతరభేదాలకి
సుతరామూ తావు లేదు. ఎందుకో తెలుసునా అంటే. జ్ఞానంలో వికల్పం లేదు. దాని
స్వరూపం ఒక్కటి. ఇప్పుడు తాడుని చూసి తాడు అనుకుంటే అది జ్ఞానం. ఇంక
తాడు కాకుండా ఇంక ఏదో అనుకుంటే అది అజ్ఞానము ఇదే సరియైన జ్ఞానం, అదే
సరియైన జ్ఞానం ఇన్ని రకాలు ఉండవు జ్ఞానంలో. So కర్మణ: భేద: కర్మణో విభాగ:
జ్ఞానస్య న విభాగ: ఇదొక point చాలా జాగ్రత్తగా గమనించదగ్గ విషయం
→ ధర్మ ద్వయం కర్మ ప్రధానంగా ఉండే ధర్మము, జ్ఞానము ప్రధానంగా ఉండే ధర్మము
కర్మ ప్రధానంగా ఉండేదానికి ప్రవృత్తి అని పేరు. జ్ఞానం ప్రధానంగా ఉండేదానికి
నివృత్తి అని పేరు. కర్మకి వెనుక అవగాహన ఉండాలి. జ్ఞానం వెనుక, నివృత్తి
అనగా జ్ఞానము దానికి కూడా అవగాహన ఉండాలి ఈ రెండు ధర్మాలని
బోధించాడు. ఈ రెండు ధర్మాలని కొత్తగా తాను కనిపెట్టి బోధించాడా?
→ బుద్ధుడు ఒక మతాన్ని ప్రారంభం చేశాడు. బుద్ధిజం. అదేవిధంగా
శ్రీకృష్ణుడు ఒక కొత్త మతాన్ని, ఒక కొత్త cult ని initiate చేశాడా?
is it Srikrishnaism. No it is not like that. వైదిక ధర్మ
ద్వయం. కాబట్టి ఈ ధర్మము శ్రీకృష్ణుడితో ప్రారంభం కాలేదు. అది మనం
గమనించాలి. సనాతన ధర్మం అంటే అలా ఉంటుంది. శ్రీకృష్ణుడితో
ప్రారంభమైనది అయితే అది సనాతనం ఎలా అవుతుంది? So అది కాల
గర్భంలో ఒక రోజున ప్రారంభం అయింది అంటే
అది మతం అవుతుంది. కాబట్టి ఇది మతము కాదు.
ఎందుకంటే మతము, ధర్మము. మతము అంటే మహాత్ముడు
ఓ [illegible] ఉంటాడు, ఓ [illegible]ని తీసుకుని

Priority Assignment

ప్రారంభం చేస్తాడు. ప్రారంభం చేస్తే, ఆయనని అనుసరించేవాళ్లు
ఒక పదిమందో వంద మందో ఉంటారు. మరి ఒంటిచేత్తో ఒంటరిగా
ఉండిపోతే అది మతం అవదు. ఓ పదిమంది ఆయనని followers
ఉండాలి followers కి తోటి ఉండరు.

→ అలాగంటే పరిస్థితి కాదు. ఒక వ్యక్తి తోటి ఆరంభం అయిన ధర్మం కాదు
శ్రీకృష్ణుడు మొదలు పెట్టిన ధర్మం కాదు. ధర్మంలో శ్రీకృష్ణుడు జన్మించాడు
శ్రీకృష్ణుని ముందు జన్మించిన ధర్మం కాదు. ఆయన ఈ ధర్మంలో పుట్టాడు.
ఈ ధర్మంలో పెరిగాడు ఈ ధర్మాన్ని పాటించాడు, తనకంటూ ఒక ప్రత్యేకత
సంపాదించుకున్నాడు. అదే సంగతి. అంతేగాని ఆయన కొత్తగా ఆరంభించిన
ధర్మము కాదు. కాబట్టి వైదికం ధర్మ ద్వయం. Very special thing
it is మనం Notice చేయాలి గాని మిగతా మతాలు, తరవాత
ఇతరమైన మతాలు బౌద్ధ ధర్మ, జైన ధర్మ చాలా ముఖ్యమైన భేదం
ఇక్కడ ఒక వ్యక్తిని అనుసరించి ఉండే ధర్మం కాదు ఇది. ఆ వ్యక్తి కి
కూడా విషయము ఎందుకు వస్తుంది అంటే ఒక సనాతన ధర్మాన్ని
పాటించాడు గనక వ్యక్తి కి విశేషము. ఇదంతే అది, అనవసరము. ఇటువంటి
వైదికమైన ధర్మ ద్వయాన్ని అర్జునునికి ఉపదేశించాడు. ఆ అర్జునుని
పరిస్థితి ఏమిటంటే "శోక మోహ మహోదధి నిమగ్నాయ". ఇంతకీ
మోహము, శోకము అనే మహా సముద్రములో మునిగిపోయి ఉన్నాడు

→ అయితే ఇలాగా శోకంలో మునిగిపోయి ఉండటానికి కారణం కూడా
ఒకటి ఉండాలి కదా. మోహము. అజ్ఞానమే కారణము. అజ్ఞానం
కాదండి కారణం బయట ఉండే పరిస్థితులు బాగాలేక నేను బాధ పడు-
తున్నానండి అంటే, అలా అనిపిస్తుంది. బయట పరిస్థితులు చేతుల
ఏదో ప్రమేయంతో వ్యక్తం అయ్యే ఏదో భాగము అనో ఏదో ఒక కారణంగా
నేను దుఃఖముగా ఉన్నాను అని అనుకోవచ్చు గాక. వాస్తవంలో బయట
పరిస్థితుల యొక్క contribution 1% అయితే మన హృదయంలో
ఉండే అజ్ఞానము contribution 99% ఉంటుంది. కాబట్టి శోకంలో
మునిగిపోయాడు అంటే, వాడు అజ్ఞానంలో కూడా మునిగిపోయినట్టే
లెక్క. శోకము, మోహము. మోహము అంటే భ్రాంతి. సం. ఈ శోక
మోహములనే మహా సముద్రములో మునిగిపోయి ఉన్నాడు. కాబట్టి
వాడు దాని నుంచి బయటకి రావాలి
అంటే ముందు ఆ మోహాన్ని తగ్గించాలి. మోహం అంటే
అజ్ఞానం, భ్రాంతి, అది తగ్గితే, Automatic గా శోకం
కూడా తొలగిపోతుంది అని శ్రీకృష్ణుడు అర్జునుడికి ఉపదేశించాడు
we will come back

→ శ్రీ కృష్ణుడు ధర్మ వ్యవహారము, రెండు రకముల ధర్మముల, అర్జునునికి ఉపదేశించినాడు. ఎటువంటి అర్జునుడు శోక మోహ పరవశుడై, నేను గొలుసు ఎప్పుడూ కూడా ధర్మాన్ని, ఆత్మ జ్ఞానాన్ని భోధించవలసినది అధికారి ఉన్న వ్యక్తికే గాని మామూలుగా ఇతర సందర్భాలలో ఎప్పుడూ భోధించరాదు. ఏదో club లో, party లో for a verity let us have some gita discussion అన్నట్టుగా ఆలాగ భోధించకూడదు ఎప్పుడూ. That kind of a thing should be never done కొంత మంది ఆలాగ కూడా చేస్తుంటారు

→ మనము అసలు గీతా అధ్యయనము దగ్గరికి ఎందుకు వచ్చాము అంటే ఈ సంసారం లో మనం జీవిస్తున్నాము గాని, సంసారము మనకి పూర్ణమైన మానసిక ప్రశాంతత నే గాని, మానసికమైన సుఖాన్ని గానీ అది ఇవ్వలేకపోతుంది. We are not entirely comfortable with the సంసారం. So ఏదో we create a system around us. ఆ system మనకి సుఖాన్ని ఇస్తుందని, సుఖ శాంతులు రావాలి మనిషికి, సుఖ శాంతుల కోసం system నిర్మాణం చేసుకుంటాడు. System అంటే ఏమిటి? పెళ్లి చేసుకుంటాడు, పిల్లల్ని కంటాడు, ఇల్లు వాకిలి కట్టుకుంటాడు, Insurance policy తీసుకుంటాడు cars, shares కొంటాడు. కొంత మంది ఇంకా elections లో పోటీ చేసి ఓ పదవిని కూడా సంపాదిస్తారు. ఈ System అంతా దేనికోసం పెట్టుకుంటారు? సుఖ శాంతుల కోసం. Right? ఇంకా somewhere in the middle of the path he looses the track. సుఖ శాంతుల కోసం మనం ఇది మొదలు పెట్టాం అనే విషయాన్ని విస్మరిస్తాడు. ఎక్కడికో wrong direction లో వెళ్ళిపోతాడు. Basic truth ని మర్చిపోతాడు. వయస్సు ఉంటే లాభం ఏమిటి? వివేకం ఉండాలి కదా! ఆ వివేకాన్ని కోల్పోతాడు. నేను చెప్తున్నది మనిషి గురించి చెప్తున్నా. So that way we are, we seek happyness & peace of mind in samsara but somehow we just dont get it. అందుకోసము, మనం గీతా అధ్యయనానికి వచ్చాము. is it not right. that is how it is.

→ ఎందుకంటే కొంత మంది అనుకోవచ్చు మనం గీతా అధ్యయనము ఒక fashion గా చేస్తున్నాము. లేదంటే ఏదో సాయంకాలం పూట ఖాళీగా ఉంది. it should not be like that గీతా class కి అధికారి ఎవరంటే శోక మోహ పరవశుడే నిజానికి. శోకము, [illegible] నివారణము. మనకి సంసారికమైన వ్యామోహాలు ఉన్నది. ఎందుకంటే the సంసారంలో మనకి సుఖ శాంతులు లేవు. ఎందుకంటే the Approach should be clean clear గా ఉండాలి

Priority Assignment

AUGUST 2019

| S | M | T | W | T | F | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

ఆశ్చే తెలుసు మాకు అంత బాగానే ఉంది అంటే probably you have to wait for some more time. కాబట్టి శోక మోహముల యందు నిమగ్నులై ఉన్నటువంటి, అదో సముద్రం వంటిది. సముద్రంలో పడ్డటువంటి ఎవరైనా ప్రయత్నించి ఎవరైనా Help చేసి రక్షించాలి గాని తనను తాను రక్షించుకోలేడు. అదేవిధంగా ఇక్కడ కూడా, అర్జునుడు శోక మోహ మహాసాగరంలో నిమగ్నుడయ్యాడు. అటువంటి వాడికి భగవానుడు ఉపదేశం చేసాడు. అయితే దేనికోసం ఉపదేశం చేసాడు? ఆయనకి లాభం ఏమిటి? ఎంత ప్రయోజనాన్ని పొందుతాడు ఆయన అంటే స్వ ప్రయోజన అభావం అది. శ్రీకృష్ణునికి దీనియందు స్వార్థము ఏమీ లేదు. అదొకటి ఇక్కడ బాగా అర్థం చేసుకోవాలి ఆయనకి స్వార్థం ఏమీ లేదు. ఈ బోధించే వాళ్ళల్లో కూడా ఒక mistake అవుతూ ఉంటుంది. ఆ mistake ఎలా వస్తుందంటే, నాకు, ఎక్కువ శిష్యులు ఉంటే బాగుంటుంది అని. శిష్యుల పేరు లో గీతా బోధన ఒక Instrument కింద వాడుకునే ప్రమాదం ఉంటుంది సమాజంలో. అలా ఉండకూడదు. కాబట్టి బోధిస్తున్నాను అంటే బోధిస్తూ ఉంటే పది మంది శిష్యులు వస్తారు. పది మంది శిష్యులు ఉంటే సమాజంలో మనకి పేరు ప్రఖ్యాతలు పెరుగుతాయి తరువాత భోగాలు అధికంగా అనుభవించవచ్చు అని సేవ చేస్తూ ఉంటారు. ఆ తరువాత ధనాన్ని మనం అధికంగా పొందవచ్చు. ఒక VIP కింద మనం నిర్మానం కావచ్చు. ఇవన్నీ కూడా మనిషికి He may not be able to define himself. But I am defining how it could be మనిషి మనసులో weakness ఎవరికి వారు దాన్ని clearcut గా define చేసుకోలేరు ఎవరికి వారు Define చేసుకోగలిగితే ఇక weakness కాదు అది once you know your weakness it is nomore a weakness, it is a strength only. it will go, you will conquer it. కాబట్టి అది ఎవరికి వారు Define చేసుకోలేరు, the other person who can see it వారు Define చేయాలి, అందుకోసం నేను దీన్ని Define చేసి పెడుతున్నాను. కనుక పేరు ప్రఖ్యాతలు, ధనము, social status భోగములు వీటి కోసం గీతను బోధించే ప్రయత్నం కనుక ఎవరైనా చేసినట్లయితే అది సరికాదు అది.

  It's a mistake.

అంతేకాక గీతను పారం చెప్పటం అనేది ఒక profession కింద convert చేయకూడదు. one should not make it a profession. అలా అనుకోకూడదు. ఇచట గీతా పారాయణ

• బోధించబడును అని, fees అనగ పెద్ద professional గా
బోధిస్తారు. 5 star Hotels లో Registration fees కట్టించుకొని
బోధిస్తారు. ఉదా: క్రోడీకరణ with registration fee - ప్రతీ శ్లోకం కూడా
మనిషికి వైరాగ్య పూర్ణునిగా తయారుచేసే మంత్రాలు, శ్లోకాలు ఉంటాయి. దాంట్లో
దానికి Registration fee తీసుకొని బోధిస్తే. It goes against the salt of
teaching it self. Very unfortunate state of affairs. కాబట్టి
ప్రయోజనం మనసులో పెట్టుకోకూడదు. ఏ ప్రయోజనం ఉండకూడదు
బోధించటానికి ప్రయోజనం అంటే అది గాలి పీల్చటానికి ఏమి ప్రయోజనం
అలాగ ఇది కూడా. స్వప్రయోజక అభావే. spontaneously, lovelingly
it should be taught. ఇదంతా శంకరుని యొక్క భాష్యంలో మరి
ఇక్కడ అంతా కూడా సమగ్రంగా నిరూపణ అయిపోయాయి. భగవానునికి ఏమి
ప్రయోజనం ఉంటుంది? ఏమి ప్రయోజనం లేకుండగా ఆయన బోధిస్తున్నాడు
అయితే మరి ఏదో ఒక ప్రయోజనం ఉండాలి కదా అంటే. OK, కేవలము
[illegible] [illegible]. ప్రాణులని అనుగ్రహించాలి అనే ఇచ్ఛ, ([illegible])
అనుగ్రహితవం ఇచ్ఛ. ఈ జ్ఞానాన్ని చెప్పినట్లయితే ఉల్లో ఒక్క శ్లోకం
ఒకడు పట్టుకొని గలిగితే వాడు కృతార్థుడు అయిపోతాడు. అంతగా దాని
మహిమను వర్ణిస్తారు. కనుక ప్రాణులను అనుగ్రహించటం కోసం బోధించాడు
మరి అర్జునునికి ఎందుకు బోధించాడు. ప్రాణులని అనుగ్రహించటం కోసం
ప్రాణులకి బోధించాలి గాని, అంటే అర్జునుడు నిమిత్తం.

→ తరువాత అర్జునుడు రెండు విధాల అధికారి ① శోక మోహాల యందు
ఉన్నాడు కనుక, శాంతి సుఖము ఇచ్చేటువంటి జ్ఞానము, ఆ జ్ఞానాన్ని పొందే
ఉపాయము, అతనికి కావాలి ఆ రకమైన అధికారి.



② సద్గుణ సంపన్నుడు. ఈ పాఠంలో జిజ్ఞాసు లక్షణాలలో చెప్పినట్లు గురు
ఎన్ని మంచి గుణాలు అవసరమో అన్ని ఉన్నాయి. కొన్ని మంచి గుణాలు, ఏవో
కొన్ని మంచి గుణాలు ఉండాలి కదండి. మరి దెబ్బలాట మనిషి,
రాగ ద్వేషాలు చాలా తీవ్రంగా గలవాడు, కుటిల బుద్ధి గలవాడు.
వాడు గీత ఏమి పాఠం వింటాడు, గీత ఏమి పాఠం చెబుతాడు?
ఒక్క పిసరు ఋజు బుద్ధి ఉండాలి. మరి వక్ర బుద్ధి, కుటిల బుద్ధి
ఉన్నవాడు గీత చెప్పటానికి పనికిరాడు. వినడానికి పనికిరాడు.
వినడానికి Bore కొడుతుంది కూర్చోడు class లో
చెప్పటం ఇక అసలు question లేదు. అంచేత పవిత్రమైన
హృదయం గలవాడు అయి ఉండాలి. సద్గుణ సంపన్నుడు
అయి ఉండాలి & Exactly arjuna is like that.

అంచేతనే అర్జునుడికి చెప్పాడు. ఎందుకంటే గుణాఢ్యైః
గృహీతః, అనుష్ఠీయమానః, ధర్మః ప్రచయం గమిష్యతి అది [illegible]
ఇది కూడా, ఈ వాక్యం కూడా గీతలో ఉండే ఒకటి రెండు శ్లోకాలలో
తాత్పర్యాన్ని ఆయన ఇక్కడ చూపిస్తున్నారు. ఎప్పుడూ కూడా గుణాఢ్యు
గుణముల చేత అధికమైన వాడు. ఎప్పుడూ గుణాధికుడికి Impor-
-tance వయస్సులో అధికుడు ఉంటాడు. అది ప్రధానం కాదు. ధన
ఉండే విలువ దానికి ఉంటుంది, ఇక్కడ ముఖ్యం కాదు. ధనాధికుడు
ఉంటాడు. అదీ ముఖ్యం కాదు. అధికార అధికుడు ఉంటాడు అది
ముఖ్యం కాదు. ప్రతిష్ఠ - లోకంలో పేరు ప్రఖ్యాతులలో అధికుడు
ఉంటాడు. అదీ ముఖ్యం కాదు గుణాధికుడు అను ఉండాలి ఆ
కళ్యాణ గుణములు, పవిత్ర గుణములు, దయ, ప్రేమ, ఋజుబుద్ధి
ధర్మ బుద్ధి, ఇలాంటి సద్గుణములు ఏవైతే అందరికీ తెలుసునో
వాటిలో ఓ అధికుడు ముందు ఉన్నవాడు. గుణాధికుడు. అటువంటి
వాళ్ళు గనక గృహీతః. వాళ్ళు స్వీకరించే ఆ జ్ఞానాన్ని స్వీకరిస్తే, అనుష్ఠీ-
-యమానః - స్వీకరిస్తే చాలదు. దాన్ని తమ జీవితంలో భాగంగా
చేసుకోవాలి, అనుష్ఠాన వేదాంతం అంటారు - స్వామి వివేకానంద ప్రయోగించాడు
ఆ పదాన్ని, practical వేదాంత అని, దాన్ని తెలుగులో వెళ్ళి అనుష్ఠాన
వేదాంతం అని అనువదించారు చాలా చక్కని అనువాదం చాలా
గొప్ప అనువాదం. practical వేదాంత అని ఇంగ్లీషులో అప్పు చెబితే
ఏమో ఏం చేసేవారో గానీ, అనుష్ఠాన వేదాంతము, అందమైన అనువాద
కం - అనుష్ఠీయమానః. ధర్మాన్ని భగవానుడి దగ్గర తెలుసుకోవాలి, తెలుసుకొని
దానిని జీవితం లోకి ప్రవేశ పెట్టాలి. అప్పుడు గుణాధికుడే ఆ పని
చేయగలుగుతాడు. ఆ విధంగా గనక అయితే ప్రచయం గమిష్యతి ధర్మం
చాలా వృద్ధిని పొందుతుంది. ప్రచయం అంటే వృద్ధి. వృద్ధిని పొందుతుంది
ధర్మం వృద్ధి పొందాలని శ్రీకృష్ణ అవతారం యొక్క లక్ష్యం అది. ఎందుకంటే
అవతార ప్రయోజనమే అది కాబట్టి అర్జునుడికి గనక చెప్పినట్లయితే
ఇది బాగా అభివృద్ధిలోకి పోతుంది మహాత్ములు అలాగే ప్రవర్తిస్తారు.
స్వామి రామకృష్ణ పరమహంస కూడా వివేకానందుడికి బోధించి
ఆయన చెప్పినట్లే, ఇంక ప్రపంచానికి ఇది అందిపోతుంది. మన వాళ్ళకి
అందుతుంది. అని అంటారు. ఆ విధంగానే ఒక వివేకానందుడికి
చెప్పబట్టే అద్భుత చేసేటువంటి బోధలు ప్రపంచంలో అందరికీ
అందాయి. అలాగే ఇతర సందర్భాలు కూడా అటువంటివే. నం
శ్రీకృష్ణార్జునుల పరిస్థితి కూడా అదే.

• International Day of Friendship

08:00 "తం ధర్మం భగవతా యదుపదిష్టం వేదవ్యాసః సర్వజ్ఞో భగవాన్
గీతాఖ్యైః సప్తభిః శ్లోకశతైః ఉపనిబబంధ।"

09:00 → ఆ ధర్మాన్ని - తం ధర్మం. వేద వ్యాస మహర్షి - భగవాన్ అంటే పూజనీయుడు
పూజింపదగిన వాడు. పూజ్యుడు అనకూడదు. పూజ్యుడయిన వేదవ్యాసుడు
10:00 అనకూడదు పూజనీయుడైన వేద వ్యాసుడు అని అనాలి. పూజ్యుడు అంటే
సున్నా అని అర్థం. ఆ ప్రయోగం అలా చేయకూడదు. పూజనీయుడు అని
11:00 చెయ్యాల్సి ఉంటుంది. పూజింపదగిన వాడు. అది ప్రత్యయం - పూజనీయుడైన
వేదవ్యాసుడు. సర్వజ్ఞః ఆయనకి అన్నీ తెలుసు. ఆయనకి తెలియనిది అంటూ
12:00 ఏమీ లేదు. ఎందుకంటే వేదములను అన్నింటినీ edit చేసాడు. వేదాల్ని edit
చేసాడంటే అదెంత సామాన్యమైన మాట! ఆ రోజుల్లో పది మంది Assistent లని
Lunch పెట్టుకొని చేసాడా ఏంటి పాపం ఆయన. అన్నీ ఆయనే చదువుకొని, అన్నీ ఆయనే
edit చేసాడు. One man Army కింద చేసాడు. అంతటి ఆయన సర్వజ్ఞుడు
13:00 ఆయన ఏం చేసాడంటే భగవానుని ఉపదేశాన్ని ఉపనిబబంధ - దానికి ఒక
గ్రంథము ఆకారాన్ని కూర్చినాడు. చక్కటి ఉపదేశం. ఉపదేశం అలా
14:00 గాలిలో ఉండి, దాన్ని ఒక చోటికి చేర్చి, సంగ్రహం కాగితంమీదో లేక తాటాకుమీదో
పెడితే దాన్ని శ్లోక రూపంగా, అందరూ కంఠస్థం చేయగలుగుతారు. తేలికగా.
15:00 గద్యం అంటే కంఠస్థం చేయటం కష్టం శ్లోకం అయితే తేలిక. ఆవిధంగా దానికి
ఒక ఉపనిబంధము అంటే శ్లోకాత్మకమైన గ్రంథము. ఆ shape ని వేద
16:00 వ్యాస మహర్షి తీసుకువచ్చాడు. అదేమీ సామాన్యమైన కృషి కాదది. ఆయన
సర్వజ్ఞుడు కనుకనే చేయగలిగాడు. ఆ శ్లోకాలు ఆయన 700 శ్లోకాలలో
17:00 పెట్టాడు. అయితే శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశాన్ని కొంచెం చిలవలు, పలవలు
చేర్చాడా, కొంచెం Drop చేసాడా అంటే లేదు యదుపదిష్టం. ఆయన ఎంత
18:00 ఉపదేశం చేసాడో అంతే. సుమారు 700 శ్లోకాలు. మీరు Number గురించి
ఏమీ చింత చేయకండి. Number is not importent. సుమారు 700.
Eve. శ్లోకాలలో మానవ జీవితానికి సంబంధించిన మొత్తం సారమంతా వచ్చేసింది. ఇంక
ఏమీ మిగల లేదు. మీరు ఏ topic అయినా చెప్పండి, గీతలో Quotation ఉంటుంది
Gita is like that Any topic, Gita has the ultimate, Authantic
openion about it. ఇంక మనకి అంతకంటే ఏమి కావాలండీ! సో చాలా
చక్కని కరదీపిక అది. Priority ◀ కరదీపిక అంటే చేతిలో Assignment ◀
కాగడా పట్టుకొని నడుస్తుంటే ఎంత తేలికగా మనం దారి కనుక్కుంటామో
చక్కగా ముందుకు వెళ్ళిపోవచ్చు. సో జీవితంలో గీత కరదీపిక
వంటిది. చాలా గొప్ప గ్రంథము. So that is how it is

AUGUST 2019

| S | M | T | W | T | F | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | • | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

"తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థ సారసంగ్రహ భూతం దుర్విజ్ఞేయార్థమ్ ॥"

→ ఇక్కడ వచ్చేసింది ఆ మాట, శాస్త్రం అనేమాట. తత్ ఇదం గీతా శాస్త్రం తత్, ఇదం గీతాశాస్త్రం. తత్, ఇదం అని అలా వాడుతుంటారు, సంస్కృతంలో అదికూడ తత్ అంటే ప్రసిద్ధమైన, పైన వర్ణించిన విధంగా ప్రసిద్ధమైన ఇదం - అంటే మన ముందున్న గీతాశాస్త్రం. గీత అది శాస్త్రం. శాస్త్రం అనే పదానికి అర్థం వేదము అని అర్థం. వేదము అనే అర్థంలో శాస్త్ర పదాన్ని వాడతారు. బ్రహ్మ సూత్రములలో మూడవ సూత్రం "శాస్త్ర యోనిత్వాత్" అని సూత్రం. అంటే అర్థం వేద యోనిత్వాత్ అని అర్థం దానికి. శాస్త్ర శబ్దానికి వేదము అని అర్థము. ఎందుకంటే బోధించేది - శంసతి ఇతి శాస్త్రం. లేదా కర్మ కాండ part మీరు చూసుకుంటే శాసించేది శాస్తి ఇతి శాస్త్రం. ఈ గీత అన్నది ఒక శాస్త్రం. ఇందులో శాసించే పాలు తక్కువ బోధించే శాస్త్రం పాలే ఎక్కువ. అక్కడక్కడ శాసించారు కూడా. కురు కర్మైవ తస్మాత్త్వం అని ఏవో అలాంటి మాటలు లేకపోలేదు. Emphesis is educating the person so out of love & also according to content ఏదో సేవ అందించటం అవసరం. But the emphesis is not on సేవ. ఆశ్రమానికి మనం వెళ్ళమంటే మన Knowledge పెరగాలి. జీవితాన్ని గురించి మనకి ఉండే అవగాహన పెరగాలి. అది ఆశ్రమం యొక్క లక్ష్యం అలా ఉండాలి అంతేగాని ప్రతి మనిషిని ఓ షేప్‌లో పెడుతుండటం

→ ఈ గీతా శాస్త్రం, గీత శాస్త్రం ఇది ముందసలు ఆ సంగతి గమనించాలి. శాసంతి శాస్త్రం కాదు. శంసతీతి శాస్త్రం. శాస్తృతి శాస్త్రం- విధినిషేధాలని బోధించే గ్రంథం. ఇది అలాంటి గ్రంథం కాదు. అది అవసరమే దాని పద్ధతి దానికి ఉంది, ఇక్కడ ఈ స్కేలులో శాసనకాదు శంసతి - చెప్తుంది. చెప్తుంటా అంటే బోధిస్తుంది. ఏమి బోధిస్తుంది అంటే మనిషియొక్క కర్తవ్యాన్ని, మనిషి ఏరకంగా ఆలోచించాలి అనే భావములను మనకి అందజేస్తుంది. ఒక విలక్షణమైన భావజాలాన్ని మనకి అందజేస్తుంది. ఆ process లో మన హృదయంలో దూరుకుపోయి ఉన్నటువంటి అజ్ఞాన భావజాలం ఏదైతే ఉందో దాన్నింతనే కూడా శోధన చేస్తుంది. కనుక ఆకారణంగా దానికి శాస్త్రం అనే పేరు. "తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థ సారసంగ్రహ భూతం"

Assignment Priority

→ వేదములు అని ఉన్నాయి. ఈ వేదము అనేది ఇప్పుడు ఎలాగంటే
Eg: మామిడి పండు - fruit research center - మొక్క - పండు
గీతలో పని చేసేవాడు - వాళ్ళ పిల్లలు
కష్ట ప్రారబ్ధం ఒకల్లది, సుఖ ప్రారబ్ధం ఇంకోకల్లది - వేదము - గీత
→ వేద వృక్షము - నాలుగు కొమ్మలు - చెట్టు సారము పండు
సమస్త వేదార్థ సార సంగ్రహభూతం - గీత అంటే. దానికి ఒక్క problem ఉంది దుర్విజ్ఞేయార్థం. దీని అర్థం అంటే తాత్పర్యం. తాత్పర్యం అంటే తత్పరత తో చెప్పేది. ఇదిగో ఇది దీని యొక్క మూల సూత్రం అని ఏది చెపుతారో దానికి తాత్పర్యం అని పేరు. ఏది మాటలు కూడా చెప్పొచ్చు. ఈ ఏది మాటలన్నీ కూడా సూచించే మాట ఒకటి ఉంది ఆ మాటని నిలబెట్టడం కోసం ఈ మాటలన్నీ చెప్తాం అది తాత్పర్యం. ఆ తాత్పర్యాన్ని గ్రహించటం చాలా కష్టం. ఎందుకంటే too many issues are involved. there is a scope for lot of confusion. అసలు మానవ మస్తిష్కము confusion ని create చేసుకోవటంలో చాలా చక్కగా పని చేస్తుంది. మానవులు చేసే పని confusion ని create చేయటం. ఎలాగంటే సమస్య ఉన్నది. అందులో మన హైందవ సాహిత్యం too big. ఏదో ఒక Book ఉంటే దానిలో కుస్తీ పట్టొచ్చు, a library of spiritual Books. ఏది తీసుకున్నా ఇంక ఇదే సర్వం అన్నట్టు ఉంటుంది. శివ పురాణం, విష్ణు పురాణం etc
→ politics లో ఎంత confusion, & complexicity ఉందో ఆ ధార్మిక రంగంలో కూడా అలానే ఉంది. కాల ప్రభావం అది. కాలకాలంలో ఇక్కడి Development
→ అందరికీ గీత ఒక గొప్ప గ్రంథము అని అభిప్రాయము. కాబట్టి ప్రతివాడు కూడా గీతను తనకి అనుకూలంగా మార్చుకునే ప్రయత్నం చేస్తాడు. గీత ఏం చెప్పింది తెలుసుకునే ప్రయత్నం ఎవ్వరూ చేయరు. దాన్ని తనకి అనుకూలంగా మలుచు-కునే ప్రయత్నం చేస్తారు. సమాచారం ఉన్నది దాన్ని మనం తెలుసుకుందాము అనే జిజ్ఞాస కనపడనే కనపడదు. కేవలము ఆ ఉన్న సమాచారాన్ని మనకి అనుకూలంగా తిప్పటం, మలచుకోవటం. మలుచుకోవటానికి వీలు పడితే మలచి చేసుకోవటం. మలచుకోవటానికి వీలు పడకపోతే దాన్ని విరిచేసి distort చేసేసి మలచి చేసుకోవటం. ఎలా అయినా మనకి అనుకూలంగా చేసుకోవటమే ఇదే పనికి కం భగవద్గీతని ఆ విధంగా విరిచేసి, పాడు చేసి దాని తాత్పర్యాన్ని సర్వథా భ్రష్టు పట్టించటం అనటు వంటి సందర్భం భారత దేశంలో నిండా ఉన్నది. దానికి కారణం ఏమిటంటే అంటే దుర్విజ్ఞేయార్థం - మనిషి రాగ ద్వేషాలకి లోబడటం గ్రంథాన్ని

→ వేదములు అని ఉన్నాయి. ఈ వేదము అనేది ఇప్పుడు ఎలాగంటే
ఉదా: మామిడి పండు - fruits research centre - మొక్క - పండు
గీతలో పని చేసేవాళ్ళు - వాళ్ళ పిల్లలు
కష్ట ప్రారబ్ధం ఒకళ్ళది, సుఖ ప్రారబ్ధం ఇంకొకళ్ళది - వేదము - గీత
→ వేద వృక్షము - నాలుగు కొమ్మలు - చెట్టు సారము పండు
సమస్త వేదార్థ సార సంగ్రహభూతం - గీత అంటే. కానీ ఒక్క problem
ఉంది దుర్విజ్ఞేయార్థం. దీని అర్థం అంటే తాత్పర్యం. తాత్పర్యం అంటే
తత్పరత తో చెప్పేది. ఇదిగో ఇది దీని యొక్క మూల సూత్రం అని ఏది
చెప్తారో దానికి తాత్పర్యం అని పేరు. ఏది మాటలు కూడా చెప్పొచ్చు. ఈ ఏది
మాటలన్నీ కూడా సూచించే మాట ఒకటి ఉంది ఆ మాట్ని నిలబెట్టడం
కోసం ఈ మాటలన్నీ చెప్తాం అది తాత్పర్యం. ఆ తాత్పర్యాన్ని గ్రహించటం
చాలా కష్టం. ఎందుకంటే too many issues are involved. there is a
scope for lot of confusion. అసలు మానవ మస్తిష్కము confusion ని
create చేసుకోవటంలో చాలా చక్కగా పని చేస్తుంది. మనుష్యులు చేసే
పనే confusion ని create చేయటం. ఎలాగంటే సమస్య ఉన్నది. అందులో
మన హైందవ సాహిత్యం too big. ఏదో ఒక Book ఉంటే దానిలో కుస్తీ
పట్టొచ్చు, a library of spiritual Books. ఏది తీసుకున్నా ఇంక
ఇదే సర్వం అన్నట్టు ఉంటుంది. శివ పురాణం, విష్ణు పురాణం etc
→ politics లో ఎంత confusion, & complexity ఉందో ఆ ధార్మిక రంగంలో
కూడా అలానే ఉంది. కాల ప్రభావం అది. కలికాలంలో ఇదో పెద్ద Development
→ అందరికీ గీత ఒక గొప్ప గ్రంథము అని అభిప్రాయము. కాబట్టి ప్రతివాడూ కూడా
గీతని తనకి అనుకూలంగా మార్చుకునే ప్రయత్నం చేస్తాడు. గీత లో చెప్పింది
తెలుసుకునే ప్రయత్నం ఎన్నడూ చేయడు. దాన్ని తనకి అనుకూలంగా మలుచు-
-కునే ప్రయత్నం చేస్తాడు. సమాచారం ఉన్నది దాన్ని మనం తెలుసుకుందాము
అనే జిజ్ఞాస కనపడనే కనపడదు. కేవలము ఆ ఉన్న సమాచారాన్ని మనకి
అనుకూలంగా తిప్పటం, మలుచుకోవటం. మలుచుకోవటానికి వీలు పడితే
మలి చేసుకోవటం. మలుచుకోవటానికి వీలు పడకపోతే దాన్ని విరిచేసి distort
చేసి మలి చేసుకోవటం. ఎలా అయినా మనకి అనుకూలంగా చేసుకోవటమే
ఇదే పని కం భగవద్గీతకి ఆ విధంగా విరిచేసి,
పాడు చేసి దాని తాత్పర్యాన్ని సర్వథా (భ్రష్టు పట్టించం) జనాలు వంటి
సందర్భం భారత దేశంలో నిండా ఉన్నది. దానికి కారణం ఏమిటి
అంటే దుర్విజ్ఞేయార్థం - మనిషి రాగ ద్వేషాలకి లోబడే గ్రంథాన్ని

02 August
Friday

Day (214-151) 2019

International Friendship Day

Wk. 31

చదువుతాను. Already కొన్ని రాగద్వేషాలని నింపుకొని అప్పుడు గ్రంథాలలోకి వెళతారు. Eg: గీతా ప్రొఫెస్ - అద్వైత వ్యాఖ్య
→ ఈ విధంగా జనులు కొంత తమ యొక్క రాగద్వేషాలని దానియందు మోపి దాన్ని పాడు చేయటం ఒకటి. తరువాత వాళ్ళో కూడా శ్రీకృష్ణుడు చెప్పిన దేశ, కాల సందర్భాలు అని కొన్ని ఉంటాయి.

Eg: ఇప్పుడు అర్జునుడు సన్యాసం తీసుకుంటాను అంటాడు. సన్యాసం చెడ్డది కాబట్టి నువ్వు తీసుకోవద్దు అని చెప్పొచ్చు. చెప్పకూడదు. అలా ఎలా చెప్తాడు. సన్యాసం చెడ్డది నువ్వు తీసుకోవద్దు అని ఎలా చెప్పగలడు! సన్యాసానికి ఉండే విలువ సన్యాసానికి ఉంది కదా. కాబట్టి సన్యాసం మంచిది. కానీ నీకు మంచిది కాదు అని చెప్పాల్సి ఉంటుంది. ఆయన అలా చెప్తాడు. కానీ మరి శ్లోకాల్ని విడదీస్తే సన్యాసం మంచిది అని చెప్పినట్టుగానూ ఒక శ్లోకం ఉంటుంది. సన్యాసం వద్దు అని చెప్పినట్టు మరో శ్లోకం ఉంటుంది. ఒక చోట అంటాడు "లోకోయం కర్మబంధనః" అంటాడు ఈ మనుష్యుడు కర్మ చేత బంధింపబడి ఉన్నాడు అని అంటాడు. అని కొంచెం ముందుకు వెళ్ళి "కురు కర్మైవ తస్మాత్త్వం" కాబట్టి నువ్వు కర్మ చెయ్ అని అంటాడు. కాబట్టి అంటే ఈ శ్లోకానికి, ఆ శ్లోకానికి కాబట్టి కాదు. అక్కడ ఇంకోటి ఉంది అక్కడ కాబట్టి. మనవాళ్ళు ఏం చేస్తారంటే Quoting out of context - Star news లు ఇవన్నీ కూడా. ఈ రాజకీయ నాయకులు లాగ ఆధ్యాత్మిక రంగంలో కూడా Quoting out of context మరి కర్మని support చేయాల్సివస్తే "కురు కర్మైవ తస్మాత్త్వం" అని. మరి సన్యాసాన్ని support " మరో వాక్యాన్ని Quote చేయటం. ఎవళ్ళకి తోచింది వాళ్ళు quote చేయటం. ఆ తరువాత stage ఏవిధంగా వచ్చిందంటే, దేవుడు లేడని చెప్పేవాడు కూడా భగవద్గీతని quote చేసే పరిస్థితి వచ్చింది. Communist లు కూడా భగవద్గీతని quote చేశారు. These are some of the problems involved in understanding gita. దుర్విజ్ఞేయార్థం. అందుకోసం దీనికి సరైన భాష్యం ఆవశ్యకత ఉన్నది అని చెపుతున్నారు.

→ "తదర్థావిష్కరణాయ అనేకైః వివృత పదపదార్థ వాక్యార్థ న్యాయమ్ అపి అత్యంత విరుద్ధానేకార్థత్వేన లౌకికైః గృహ్యమాణమ్ ఉపలభ్య అహం వివేకతః అర్థనిర్ధారణార్థం సంక్షేపతో వివరణం కరిష్యామి ||"

Assignment | Priority

AUGUST 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | • |

→ శంకరాచార్యుల కాలంలో గీత యొక్క పరిస్థితి మనకి ఈ శ్లోకంలో అర్థం
అవుతుంది. ఆ నాడు గీత మీద అనేక వ్యాఖ్యానాలు ఉన్నాయి. అప్పటికే చాలా
popular gita. తరువాత అర్థ అపవ్యాఖ్యానాలు - ఆ గీత యొక్క అర్థము -
దుర్విజ్ఞేయార్థం అని ఇంతకు ముందు చెప్పారు - అంటే గీత యొక్క తాత్పర్యం
ఏమిటి? ఆ విషయాన్ని నిర్ధారణ చేయటం ఇదిగో ఇది దీని తాత్పర్యం. ఆ
మనం నిర్ధారించి చెప్పాలి. దాన్ని అర్థ అవధారణము అని అంటారు
Eg: Court judgement -

→ గీత లోంచి అర్థాన్ని అవధారణ చేయాలి. ఎందుకంటే గీత 650 శ్లోకాలు
ఉన్నాయి. సకల ఉపనిషత్తుల సారము అని అన్నా అనేక మార్గాలు దాంట్లో చెప్పారు
కర్మని చెప్పారు, భక్తిని చెప్పారు, జ్ఞానాన్ని రాజయోగం కూడా చెప్పారు
techniques లు చెప్పిన సందర్భాలు చాలా తక్కువ ఉన్నాయి. గీతలో ఒక
topic గా technique చెప్పిన సందర్భం ఇంచుమించు లేదనే చెప్పొచ్చు
చాలా interesting aspect ఇది సమాజంలో technique సర్వము అని
విధంగా బోధిస్తూ ఉంటారు. Meditation నేర్పిస్తాము అని అన్నారనుకోండి
what is that? Its a technique. He will teach you a technique
fair, nothing wrong. Cycle తొక్కటం లాంటిది. మీరు చిన్నప్పుడు Cycle
నేర్చుకున్న రోజులు ఆలోచన చేసుకోండి, it is a very impotent achivement
in life. It is a technique. నేర్చుకోక ముందు ఎంత కష్టమేమో రా
అని పించింది, నేర్చుకున్న తరువాత what an achivement it is అని
అనిపించేటటువంటిది. అయితే ఈ technique కి ఒక లక్షణం ఉంటుంది

→ నేను Universal law ఒకటి చెప్తున్నాను. ఆ law ఏమిటంటే
"every Human being will grow out of any technique"
మీరు ఒక technique నేర్చుకున్నారంటే, నేర్చుకునే ముందు ఎంతో శ్రద్ధగా
నేర్చుకుంటారు, నేర్చుకున్న కొద్దిరోజులు ఎంతో ప్రేమగా దాన్ని అభ్యాసం
చేస్తారు, you love to do that. అయితే slow ga మనసుకి దానిమీద
రుచి చాలా వేగంగా తగ్గిపోతుంది. Exponential గా Drop అయిపోతుంది
మొదటి రోజు ఉన్న రుచి మరో రోజుకి zero అయిపోతుంది. అందుకే you
will grow out of it. అంటే అర్థం ఏమిటి? ఆ technique మీ
దగ్గర ఉంటుంది, But you will mostly ignore it. దాంట్లో మీకేమీ పస
కనపడదు. any technique. Eg: యోగాసనాలు Car
నడపటం etc శిక్షణలు. Meditation is also like that
Meditation విషయంలో అలా జరగదని, ఖచ్చితంగా, పదిలేక
అని చెప్తారు వేరే సంగతి, But it does happen

But fortunatly in gita, you will never grow out of gita. You will love to remain with gita the whole life. b/c it doesnot teach any technique as a essential item. Technique ఉన్నది it is a small part of a bigger scheme (Understanding & discrimination) జ్ఞానాన్ని, వివేకాన్ని బోధిస్తుంది తప్పిస్తే, technique ని ఎక్కువ బోధించదు. Technique అంటే confusion కి scope కొంచం తక్కువ ఉంటుంది. whereas జ్ఞానం, వివేకం అనే సరికి there is a scope for lot of confusion. చాలా సూక్ష్మమైన విషయం కదా. కాబట్టి అనేక మంది దీని అర్థాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేసారు. ప్రయత్నం చేసి ఒక్కొక్కళ్ళు ఒక్కొ రకంగా చెప్పారు Eg:- legal pandits opinion about court judgement. మన గీతా వ్యాఖ్యాతలు కూడా అటువంటి వాళ్ళు చాలా మంది ఉన్నారు. శంకరుడికి కాలం నాటికి అనేక మంది ఉన్నారు వీళ్ళు అనేక మంది ఏమి చేసారు. "విచ్ఛేద పద పదార్థ, వాక్యార్థ న్యాయమైన పదము ఉన్నది దానికి అర్థం చెప్పాలి. వాక్యం ఉంటుంది వాక్యానికి అర్థం చెప్పాలి. పదానికి అర్థం చెబితే చాలదు వాక్యానికి కూడా అర్థం చెప్పాలి Eg:- గంగలో గొల్లపల్లె...

→ వాక్యాలకి అర్థం చెప్పేటప్పుడు న్యాయాన్ని పాటించాలి. వాక్యాన్ని అర్థం చేసుకునే శైలిని పట్టుకుని మనం గీతకి అర్థం చెప్పాల్సి ఉంటుంది వాళ్ళంత ఆ పని చేసారు. అయితే దానివల్ల గీత యొక్క బోధ మన అందరికీ చాలా సరళంగా, స్పష్టంగా తెలిసి ఉండాలి. No that is not right. Eg:- So many cooks spoil the broth అనే సామెతలాగ వీళ్ళు అందరూ కలిసి కిచిడి చేసిన పరిస్థితి ఏమిటంటే. ఒకళ్ళు చెప్పే అర్థానికి ఇంకొకరు చెప్పే అర్థానికి పొంతనే లేదు. పరస్పర విరుద్ధమైన అర్థాన్ని చెబుతున్నారు. తరువాత అనేకార్థాలని చెబుతున్నారు. అనేకార్థాన్ని శాస్త్రంలో ఒప్పుకోరు. ఒకే దానికి రెండు మూడు అర్థాలు చెప్పటం అన్నది అది బహుశా పాండిత్య ప్రకర్ష అయితే కావచ్చు కానీ శాస్త్రంలో ఒప్పుకోరు. అనేకార్థం అన్నది శ్లేష కావ్యాలకి శోభనిస్తుంది గానీ జీవితానికి సంబంధించిన బోధలో చోటుని ఇవ్వదు.

→ ఈ విధంగా గీత అత్యంత విరుద్ధమైన అర్థాలతో, అనేకార్థాలతోటి లోకి కై ప్రస్థానం అనేకుల చేత స్వీకరించ బడుతుంది. అంటే లోకంలో ఉండే జనులకి తరరాగా మనం అందజేసిన పరిస్థితి ఉంటుంది. సామాన్య జనులకి ఇటువంటి పరిస్థితి create చేస్తే చాలా ఇబ్బంది పడిపోతారు.

Assignment

Priority

AUGUST 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | • |

ఎందుకంటే, they can not workout all the details. ఈ confusion
ని వాళ్ళు clear చేయలేరు వాళ్ళకి ఏదైన ఒక సారవంతంగా క్లిష్టమైన అర్థం. ఇది
అని చెప్పినా ముందుకు వెళ్ళిపోలేరు గానీ ఇంకా confusion create చేసి
పెడితే How they can solve it? they cannot solve it.
కాబట్టి ఉపలబ్ధ్య. ఈ పరిస్థితిని గమనించి - "అహం వివరణ రాస్తున్నాను"
నేను ఈ గీతా శ్లోకాలకి వివరణాన్ని చేస్తాను. సంక్షిప్తంగా; వివరణా "
శ్లోకానికి ఇరవై పేజీలు రాసొచ్చునుకోండి అది చదివేవాడికి చాలా కష్టం
అయిపోతుంది సాధారణంగా వృథాగా చదువుకొనే విద్యార్థులకి అలాంటి
విస్తారమైన వ్యాఖ్యానాలు ఉండే సందర్భాలు ఉంటాయి లేకపోలేదు. కానీ
గీత అంటే ఇది జీవితానికి సంబంధించిన బోధ. అప్పటికప్పుడు
మీకు ఏదైనా జీవితంలో కష్టం ఉంటే, ఏదైన ఒక ఆటంకం ఏర్పడితే,
ఆపద వస్తే, అప్పటికప్పుడు గీత పుస్తకం తీసి చదువుకొని, దాన్నుంచి
మీరు ఉపదేశాన్ని పొంది, దాని ప్రకారంగా మీరు ముందుకు సాగిపోవచ్చు
Ex: మహాత్మా గాంధీ.

→ దీన్ని పట్టుకొని మీరు ఇంతింత విస్తృతమైన గ్రంథాలు రాస్తే, చాలా
వాటికి చాలా కష్టం అవుతుంది. కాబట్టి నేను సంక్షిప్తంగా రాస్తాను. అదొక
Advantage ఇంకొకటి ఏంటంటే, వివేకం: అర్థనిర్ధారణం. మీకు నేను
అర్థాన్ని నిర్ధారణ చేస్తాను. ఇది అర్థము అని నిష్పక్షపాతంగా బోధిస్తాను,
సందేహానికి తావు లేకుండా. తరువాత వివేకాన్ని బోధించి, వివేకము అంటే
ఏమిటి? there are somany issues involved, మనుష్యుని యొక్క
జీవితం చాలా complex గా ఉంటుంది. మనుష్యుని యొక్క మనసులు
చాలా జటిలంగా ఉంటాయి. మనిషి ప్రేమిస్తున్నాను అంటాడు. కానీ
వస్తే దానికి ద్వేషాన్ని జోడిస్తారు. Ex: భార్య-భర్త.
రాగం ఉంటుంది, మళ్ళీ లోభం ఉంటుంది. వైరాగ్యం ఉంటుంది, మళ్ళీ
ఆసక్తి ఉంటుంది. ఎప్పుడూ ప్రశాంతంగా ఉండాలి నేను అంటాడు. మళ్ళీ
కోపం తెచ్చుకుంటూ ఉంటాడు. మనిషి యొక్క మనసు it is a very
Complex. The outer world of objects & people is one thing and
The inner world of thoghts & feelings, my god it is all
together different very complex. ఈ స్థితిలో
మీరు ఊరికే తర్కాల లోపల లేకుండా మాట్లాడుతుంటూ
పోవడం, confusion ని మరింత Add చేయడం. This is
what people do. This is the bane of indian socity

clarity అనేది అసలు మనం మర్చిపోయాము అని అనిపిస్తుంది.
ఏదో ఒకటి clear గా చెప్పాలి. ఇన్ని concepts opposit to each
other వల్లన మనం మోసుకుంటూ ముందుకు వెళుతున్నాము అంటే
we are crushed under the burden of contradictions
* → ఎందుకంటే we want health, we work for unhealth, we want
* peace we work for war. మనం చాలా complex minds
కలిగి ఉన్నాం. We want freedom, we work for bondage
→ ఈ complex situation లో మనని save చేసేది ఒకటే వివేక-
Discrimination. అంటే ఏమిటి? ఈ complexicity ని తొలగించే విధానం
ముందు Bring ani mathematical presision into picture,
clear cut understanding you bring into the picture. అంటే
అది చాలా అవసరం. దానివల్ల ఏమవుతుందంటే the huge psychological
burden of contradicting emotions & ideas అనేది కూడా
తొలగిపోతుంది. సో ఆ వివేకం చాలా అవసరం. దీనికి దృష్టాంతం
ఏమి చెబుతారంటే ఈ పత్తిని carding అని అంటారు.
→ అదే విధంగా మన mind లో వివేకము చాలా అవసరము. Descrimination
Eg: ఈ స్వరూపం ఒక్కటే, నామ రూపముల మాత్రమే మారుతున్నాయి
తప్పితే, అన్నింటికి వెనక స్వరూపంలో ఏకమైన సందేహము లేదు. అన్నిటికి
ఒక్కటే అని. దీనివల్ల confusion ఉండదనుకోండి ఆ confusion వల్ల
బరువు పెరుగుతుందో తెలుసునా మనసుకి Eg: 4 photos, 1 photo లో ఉన్న
2,3 మంత్రాలు ఏ మంత్రం జపం. etc మన mind చాలా complex గా
ఉంటుంది. ఈ issues ఏ మనం బరువు అనుకోరాం అంటే. అలాగే
ఇప్పుడు భార్య-భర్త, తల్లి కొడుకు, అక్కా కొడుకు etc ఇంకా చాలామంది
కాని ఒకళ్లని ఒకళ్లు పెడదు. etc. why? మీరు ఎప్పుడైనా హృదయం
లో కలిగేటువంటి భావజాలాన్ని పరిశీలన చేసుకొని శోధన చేసుకోకపోతే జీవితం
చాలా బరువు అయిపోతుంది. జీవితంలో బరువు బాధ్యతలు అంటారు.
ఆ బరువు బాధ్యతలు బయట ఉండవు. ఆ బరువు అంతా మనసులోనే
ఉంటుంది. ఇప్పుడు ఓ 10వ తరగతి కుర్రాన్ని చదివిస్తున్నా అనుకోండి, ఒక
యజమాని ఒక్క అబ్బాయిని చదివిస్తున్నారు (కొడుకు), నాతోటి అన్నారు
చాలా బరువు బాధ్యత ఉన్నాయంది అన్నారు. అంటే
నేనన్నాను ఏమిటి? చెప్పండి అని. కుర్రాడు పదో తరగతిలో ఉన్నాడండి.
ఆ బరువు బాధ్యతలు ఉన్నాయి. అంటే నేను చెప్పాను. దాన్ని
బరువు బాధ్యత అనుకోండి, తప్పేది. నేను 4వ తరగతి

Assignment Priority

AUGUST 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | • |

పిల్లలకి చదివిస్తున్నాను, మా గురువు గారు పూజ్య స్వామి
దయానంద సరస్వతి గారు 4000 మందికి చదివిస్తున్నారు మనం చదివించటం
లేదంటే. ఈశ్వరుడు చేస్తున్నాడని మీరు గుర్తించగలిగితే, ఆ కుర్రాన్ని 10వ తరగతి
చదివించటం It becomes a pleasant job. మనమే చదివించేస్తున్నాము అనుకుంటే
అది పెద్ద Burden అయిపోతుంది. చేసే పని ఎలాగో తప్పదు. చేసేదేదో ఉంటుంది
ఏదో fee కట్టడమో, ఇలాంటివి ఏదో ఒకటో, రెండో అంశాలు ఉంటాయి. వాటితో పాటు
మీరు కూడా 10వ తరగతి పుస్తకాలు తీసి చదవక్కరలేదు గదా. మీ మనసులో
ఆ feeling బరువు గానే, బయట బరువు ఏముంది? వాడి బరువు వాడే
మోసుకుంటాడు వాడి తిండి వాడే తింటాడు. ఎప్పుడో ఒకసారి fee కట్టమంటాడు
వాడికి డబ్బు ఇవ్వటం తో పాటు, కొంచం encourage చేయటం, pep talk
ఇచ్చి encourage చేయటం. దీనికి ఏమి బరువు ఉంది ఇది? Its a joy.
దాంట్లో బరువు ఏముందండి. ఇప్పుడు ఎదురవాడికోసం మీరు ఓ 1000/- ఖర్చు
పెట్టారనుకోండి. Is it not a joy. sheer joy it is. Pep talk ఇచ్చారనుకోండి,
ఉత్సాహం చేసి పంపించారనుకోండి. Its a joy దాంట్లో బరువు ఏముంది.
మీకు బరువు ఎక్కడి నుండి వచ్చిందో చెప్పమంటారా. వీడు రేపు Intermediate
అవుతాడో, లేదో? Intermediate అయ్యాక Engineer/doctor అవుతాడో, లేదో?
ఆ తరువాత పెళ్ళి చేసుకున్న తరువాత మనని చూస్తాడో, చూడడో. ఆ వీడు 20
years తరువాత ఇప్పుడే చూస్తుంటారు దాంతో అది బరువు కింద భావిస్తుంది
→ Issues ని clear గా చూడటం నేర్చుకుంటే జీవితం అలాగ ఈ క్షణంలోనే
సరళం అయిపోతుంది, తేలిక అయిపోతుంది. కాబట్టి నేను మనకి చేసేది ఏమిటి
అంటే? ఇది నాకు కొంచం భావన్యం ఎక్కువ. సంస్కృత భాష్యం లో ప్రధానంగా
కనపడే అంశము వివేకము అని నాకు అనిపిస్తుంటుంది. వివేకము. ఆయన వివేక
చూడామణి అనే ఒక గ్రంథం కూడా రాసారు. 575 శ్లోకాలు, ఆయనకి చెప్పింది
చెప్పి ఆయనకి తృప్తి కలగలేదు, ఇంక చాలు అని ఓం తత్సత్ అని రాసి
ఉంటారు. తరువాత వివేకమునకు ఆయన చూడామణి అని పేరు పెట్టారు.
అతలకి అలంకారము వివేకము. వివేక యుక్తంగా ఆలోచించగలగటము. అది
భూషణం. ఇంక ఏదీ భూషణం కాదు. కాబట్టి ఆయన అంటారికడ నేను
వివేక పూర్వంగా clearcut గా, ఇదిగో ఇది కర్మ, ఇది జ్ఞానము, దీన్ని, దీన్ని
నువ్వు Continue చేసి పెట్టు. అని మీరు clearcut గా నేను మీకు
issues అన్నీ కూడా నేను clear చేసి పెడతాను.
మీరు గమనించండి అని అంటున్నారు. ఈ మాట ఎవడు
అంటాడంటే clear vision ఉన్నవాడు అంటాడు

తస్య తస్య గీతాశాస్త్రస్య సంక్షేపతః ప్రయోజనం పరం నిశ్రేయసం
సహేతుకస్య సంసారస్య అత్యంతోపరమ లక్షణం।

→ ① ఈ గీత శాస్త్రమునకు, పరమ ప్రయోజనం ఏమిటి? ఇక్కడ
ప్రయోజనము, ఫలము అని రెండు ఉంటాయి. ప్రయోజనం లో కూడా
అవాంతర ప్రయోజనము, పరమ ప్రయోజనము అని రెండు ఉంటాయి.
Eg:- ఒక Government Engineer Bridge కడుతున్నాడనుకోండి.
ప్రయోజనం ఏమిటి? అంటే ఆ Bridge కడితే ప్రజలు అందరూ ఆ
Bridge మీద ప్రయాణించి సమాజానికి ఒక సేవ అవుతుంది అది
ప్రయోజనం. ఫలం ఏమిటి? వాడికొచ్చే జీతం. ప్రయోజనాన్ని తో పని
చేయాలి గాని ఫల దృష్టితో పని చేయకూడదు. ఫలము - ప్రయోజనం
ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని మనం దాన్ని సాధించటానికి ముందుకు
వెళ్ళిపోతూ ఉంటాము. ఫలము గురించి మనం విచారణ, దృష్టి పెట్టకపోయి
ఫలాన్ని ఈశ్వరుడు మనకి ఇస్తాడు. మనం ప్రయోజనం కోసం పనిచేస్తూ ఉండాలి
చూడండి ప్రయోజనము, ఫలము. ఇదే ఒక Corrupt Government officer
ఉన్నాడనుకోండి వాడేం చేస్తాడు! వాడు Reverse చేసి పెడతాడు
ప్రయోజనం భ్రష్టు అయిపోయినా ఫరవాలేదు, ఫలం నిండా ఉండాలి నాకొచ్చే
జీతానికి రెట్టింపు లంచం నాకు రావాలి. ఈ Bridge కట్టేలోపల నేను ఒక
ఇల్లు కట్టుకోవాలి అన్నట్టు. అలాగ స్వార్థం కోసం పని చేసి ఆ Bridge
పాడైపోయినా ఫరవాలేదు. అది కూలిపోయినా ఫరవాలేదు. నాకు ఫలం కావాలి
ఆ దృష్టి కోణం చాలా తప్పు ప్రయోజనం వేరు, ఫలం వేరు. అయితే
ప్రయోజనం అనే పదం వాడారు, ఫలం అనే పదం వాడలేదు మీరు గమనించాలి
ఎందుకంటే గీత లో నేను ఫల దృష్టి పెట్టుకోవద్దు అని చెప్పబోతున్నారు. కాబట్టి
ముందే ఫలము అని చెప్పరు. కాబట్టి గీతా శాస్త్రం యొక్క ప్రయోజనం ఏమిటి?
that is the point - ①.

② ప్రయోజనం కూడా అవాంతర ప్రయోజనము, అంతిమ / శాశ్వత ప్రయోజనం
అని ఉంటుంది Eg:- Bridge - అవాంతర ప్రయోజనం - తాత్కాలికంగా ఆ
Bridge ని 25 ఏళ్ళ నిర్మాణం చేసినట్టయితే ఆ ఊళ్ళో వాళ్ళకి, ఆ ఊళ్లో
వాళ్ళకి మనం సేవ చేసిన వాళ్ళం అవుతాము.
పరమ ప్రయోజనం - ఈ విధంగా నేను ప్రజాసేవ చేస్తూ, Government
service చేసినట్టయితే నేను భారతమాతకి నా జీవితాన్ని
సేవతో అంకితం చేసిన వాణ్ణి అవుతాను. తద్వారా నాకు మోక్షం

• లభిస్తుంది. అలాగే గీతను చదువుకుంటే ఆలోచనను ఏమిటి? నం లాభ
ఫలం ఏమీ లేదు. ఇతర పారాయణ గ్రంథాలు - వాటి ఫలితములు. అలాంటి ఫలము
మీకు గీతా పారాయణంలో ఏమీ రాదు. గీత మీరు పారాయణ చేయక్కరలేదు.
→ పారాయణ అనేటప్పటికి, పుణ్యం కోసం, ఫలం ఉంటుంది. దానికి గీత ఫలంకోసం
వచ్చింది కాదు. ఫలాన్ని విడిచిపెట్టమని చెప్పటం కోసం వచ్చింది గీత. ఫలం గురించి
నువ్వు చింత పెట్టుకోవద్దు. కాబట్టి ప్రయోజనం.
→ తాత్కాలిక ప్రయోజనం ఏమిటి గీతకి అంటే మీరు ఇంట్లో ప్రశాంతంగా జీవించటం
ఇంట్లో మిగతా వాళ్ళకి కొంత శాంతి కలిగించటం. ఇవన్నీ తాత్కాలిక ప్రయోజనాలు.
గీత చదువుకుంటున్నాడంటే వాడు కొంచం సాత్వికంగా తయారవుతాడు. ఈ సంసారం
యొక్క ఆ మత్తు కొంత తగ్గుతుంది. శాస్త్రంలో అలా వర్ణించారు కాబట్టి నేను
చెప్తున్నాను. సంసారము అనేది - అసలే కోతి - అది మద్యాన్ని (కావాలన్న) తాగింది. తరువాత దానికి తేలు కుట్టింది - దయ్యం పట్టింది. ఇప్పుడు మీరు
ఆ కోతిని ఊహించండి అది సంసారం అంటే. Anyway తాత్కాలికంగా
మనసు కొంచం చల్లారుతుంది. దానికి ఉన్నటువంటి మాసుడు తగ్గుతుంది
మనసు కొంచం వివేకంలో పడతాడు మనిషి. సరిగ్గా ఆలోచన చేయటం
ప్రారంభిస్తాడు. కొంచం ప్రశాంతంగా బ్రతకటం అలవాటు చేసుకుంటాడు.
చుట్టుపక్కల ఉన్నవాళ్ళకి కూడా ప్రశాంతతని ఇస్తాడు. వాడు ప్రశాంతంగా ఉంటే
చుట్టుపక్కల వాళ్ళకి కూడా Automatic గా లభిస్తుంది. ఇది తాత్కాలిక ప్రయోజనం.
పరమ ప్రయోజనం మాత్రం అది కాదు. పరమ ప్రయోజనం ఏమిటంటే
మోక్షము, నిశ్రేయసము. నిశ్రేయసం అంటే అర్థం ఏమిటో తెలుసునా అండీ
ఇంతకంటే గొప్ప శ్రేయస్సు మరొకటి లేదు. అది నిశ్రేయసం. మీరు స్వరూపతః
దైవ స్వరూపులు. మీ దైవ స్వరూపాన్ని మీరు గుర్తించి దైవస్వరూపులుగా
ఉండిపోవటం. అంతే నిశ్రేయసం అంటే. ఇంక అంతకంటే కొత్తగా సాధించేది ఏమీ
లేదు. అది మోక్షము. ఇది మనం Regular గా పాఠం చదివేది అది గీత
యొక్క పరమ ప్రయోజనం. కాబట్టి గీత యొక్క ప్రయోజనం ఏమిటంటే
యుద్ధం మానేస్తానన్న అర్జునుడి చేత యుద్ధం చేయించటము. కాదు. అది
అవాంతర ప్రయోజనం. పరమ ప్రయోజనం మోక్షం. అంటే సంసారాన్ని అత్యంత
ఉపరమ లక్షణం. సంసారము విరమించబడుట. ఉపరమ అంటే విరామము.
Come to an end సంసారము come to an end అంటే ఏమిటండి.
ఇల్లు, వాకిలి, పిల్లలు ఇవన్నీ లేకుండా అయిపోతుందా?
అలా అనుకోవద్దు. సంసారము అంటే భార్య, పిల్లలు, సంసారము
కాదు. సంసారం అంటే నిరంతర ప్రవాహ రూపమైన సుఖదుఃఖము
లకే సంసారం అని పేరు. తాత్కాలికంగా short range లో

SEPTEMBER 2019

| S | M | T | W | T | F | S |
|---|---|---|---|---|---|---|
| 29 | 30 | • | • | • | • | • |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |

Long Range లో ప్రవాహ రూపమైన జన్మ మరణ
పరంపరకే సంసారం అని పేరు. అంటే మనకి సుఖము, దుఃఖము అలా
పరంపరగా వస్తూ ఉంటాయి. పైకి పోతూ ఉంటాం, కింద పడుతూ
ఉంటాం, ఏదో ఒక దాని వెంట పరిగెత్తుతాం. అది దొరికితే మనం సమర్థులం
successful అని సంతోషము పడతాం. అది దొరకక పోతే నా అంత
అయోగ్యుడు లేడు అని బాధ పడుతుంటాం. అది అయిపోతుంది, ఇటు,
అటు అవుతుంది తరువాత మరో దాని వెంట పడుతూ ఉంటాం. ఇదే
సంసారము. ఈ సంసారము మనల్ని విశ్రాంతి లేకుండా చేస్తుంది మనం
అలసిపోయేలా చేస్తుంది. అందుకనే ఒక రోజులో మీరు చూడండి, రాత్రి
10 అయ్యేటప్పటికి, My god I am done with it. I can not handle
it anymore అంటారు. అంటే కాదండి ఈ work పూర్తి చేస్తే 1 million
డబ్బు వస్తుంది అంటే. బాబు ఇంక, రేపు చూస్తాను అంటారు. ఎందుకంటే
సంసారము, మనిషిని బాగా అలసట పడేలా చేస్తున్నది. దేహము, ఇంద్రియ
-ములు, మనస్సు. మనసు తో ప్రారంభం అవుతుంది అలసట. మనసులో
అలసట వచ్చేస్తుంది. దాంతో ఇంద్రియాలు అలసట వచ్చేస్తుంది దేహం
అలసట వచ్చేస్తుంది. ఇంక తట్టుకోలేడు. ఆ సంసారము తట్టుకోలేక
పడుకొని నిద్ర పోతాడు. ఆ నిద్ర పట్టకపోతే tablet వేసుకొని నిద్ర
పోతాడు. దాన్ని ఉపరమ అంటారు - సంసార ఉపరమ. కాబట్టి ఈ
ఉపరమము అనే ఒక Mechanism భగవంతుడు మనకి పెట్టాడు.
మీరు ఆలోచించండి తెల్లవారి లేస్తే అనేక సమస్యలు, అనేక బాధ్యతలు,
బరువులు మనకి ఉంటాయి ఈ బరువు బాధ్యతలు ఇలాగ
కొనసాగిపోతూ రాత్రి 10 అయ్యే నాటికి వాటికి full stop లేదనుకోండి
అలా ఎన్ని రోజులు కొనసాగించగలరు మీరు? అది సంభవం కాదు. కాబట్టి
మనం ఏ సంసారము బాగా లేనిది అని అనుకుంటున్నామో, దాని నుంచి
విరామాన్ని ఎప్పుడూ కోరుకుంటాం. హమ్మయ్య బాబోయ్ భగవంతుడా అనే
అనిపించే స్థితి మనకి ఉంటుంది. పరమేశ్వరుడు ఆ Mechanism ని
పెట్టాడు. దాని పేరే నిద్ర. అయితే మరి కేవలం నిద్రం ఎందుకంటే అల్పంలో
ఉపరమ [illegible]. అంటే మెలకువగా ఉన్నప్పుడు కూడా సంసారపు బరువు
లేకుండా జీవించగలమా? "Yes"

Assignment

Priority

AUGUST 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | • |

→ అసలు ఏమని చెప్పారంటే గీతా శాస్త్రం బోధించేది అంతిమ ప్రయోజనం,
సర్వ శ్రేష్ఠమైన ప్రయోజనం, అవాంతర ప్రయోజనాలు కాదు. జీవితానికి అంతిమంగా
కూడా గీతాశాస్త్రం బోధించే పరమ లక్ష్యం ఏమిటి? అన్నట్లయితే - సహేతుకమైన
సంసారస్య అత్యంతిక పరమ లక్ష్యం సంసారం అంటే short ranged long
range అర్థం చెప్తాము. ఈ పరిచ్ఛిన్న జీవుని యొక్క ఈ పాట్లు, ఈ విశాల
జగత్తులో ఈ పరిచ్ఛిన్న జీవుని యొక్క ఈ పడరాని పాట్లు ఏవైతే గలవో
దీనికి సంసారము అని పేరు. ఈ సంసారం మరణించిన తరువాత కూడా కొనసాగుతుంది
ఎందుకంటే మరణం అంటే దేహానికే గాని, జీవ తత్వానికి ఆ సూక్ష్మ శరీరం అలాగ
కొనసాగుతూనే ఉంటుంది. కనుక ఈ సంసారము పూర్తిగా తొలగిపోవాలి. ఆత్యంతిక
ఉపరమం. అత్యంత అని వేసుకుంటూ ఉండాలి. Absolute cessation of సంసార.
తాత్కాలికమైన cessation ఎప్పుడూ వస్తూనే ఉంటుంది. మీరు నిద్రపోయినప్పుడు
పోయింది సంసారము. నిద్ర దాకా అక్కర లేదు first class absorbing cinimaకి
వెళ్లారనుకోండి సంసారం ఉండదు. సినిమాలో సంసారం ఏమున్నా ఉంటుంది వాడు ఇంకో
సంసారం పెడతాడు అక్కడ, ఆ director కనుక కథ చెప్పటంలో మంచి తెలివైన
వాడు అయితే, మీరు Absorb అయిపోతారు దాంట్లో. దాంతోటి ఏమైపోతుందంటే
ఈ సంసారం Background లోకి పోతుంది మళ్లీ Interval రాగానే సంసారమే.
తాత్కాలికమైన ఉపరమము అంటే cessation ఎలాగో ఉంది. దీనికోసం గీతా శాస్త్రం
ఎందుకు? ఇవన్నీ ఉంటున్నాయి. నిజానికి ఒక సిద్ధాంతం ఏమిటంటే ఈ pleasure అని
అంటారు, Pleasure అంటే ఏమిటి? It is an Escape from the burdane of
సంసారం. భోగము అనేదానికి నిర్వచనం ఏమిటంటే, భోగంలో ఏదో some content
of Happyness ఉందని నువ్వు అనుకుంటున్నావు వెర్రివాడా, అది ఏమీ లేదు. నీవు
ఈ సంసారపు బరువు బాధ్యతల నుండి పారిపోయే ప్రయత్నం, ఒక పలాయన
వాదమే భోగము. నిజానికి చాలామంది psychologist లు అలాగే చెప్పారు
Eg:- Alcohol, drugs, cinima & for some people Eating itself is an
escape. They eat b/s they are in tension tension లో ఉండి ఎక్కువ
తింటున్నారు. ఈ విధంగా ఈ భోగాలన్నీ పలాయన వాదం తప్ప మరేమి కాదు.
కొంత మంది Dance లు చేస్తుంటారు. why they should do dance.
they should do Excersise, what is this dance (భోగం కోసం)
ఈ physical movement ఎప్పుడైతే వచ్చిందో, మనసు It gets
Engaged with physical body?? Body is an intense
activity, Body లో Intense activity వచ్చిన సరికి మనసుకి
మిగతా విషయాలు ఆలోచించే తీరిక ఉండదు. మనసు Engage
అయిపోతుంది. So it gives a kind of relapse